శుభమస్తు,

# నిర్వచన లీలారామాయణము.



శ్రీమద్విశాఖపురవర
ధామా! శ్రితభక్త మోక్షదాయక! సతసు



శ్యామా! కోదండరామ! శాత్రవభీమా. 1

క. లీలారామాయణముగ
నీలీలలఁ బద్యగతిని నేఁగచియింతున్
మేలొసఁగు మార్యసన్నుత
శీలా! కరుణాలవాల! శ్రితజనపాలా. 2

క. శ్రీమదయోధ్యా రాజ్యర
మామణి యలరారు శ్రీరమా నిలయంబై
ధీమహితుండగు దశరథ
భూమీశుఁడు దానినేలు బుధజన హితుఁడై. 3

క. పాకారి విభుండగు నా
భూకాంతుని కాంతలెన్న ముగ్గురు వారల్
లోకస్తుత గుణ శీలలు
కైకేయి సుమిత్రి మఱియుఁ గౌసల్య యనన్. 4

సీ. దశరథుండంత సంతానంబు లేమిచేఁ
బుత్రకామేష్టి నింపుగ నొనర్ప

మురహరు చతురంశముల రామ, లక్ష్మణ,
భరత, శత్రుఘ్నులు భాను తేజు
లాతని కాత్మజు లయిధనుర్వేదాది
సద్విద్యల నెఱింగి చతురులైన
యానందనులఁగని సానందుఁడగు దశ
స్యందనుఁ గని గాధి నందనుండు

తే. గీ. అధిప! నేనొక్క యాగంబు నాచరింపఁ
గలుషచారిత్రులైన రక్కసులు దానిఁ
జెఱుచు చున్నారు వారలఁ జెండిన దు
యాగమును గావ శ్రీరాము నంపుమనిన. 5

క. దశరథుఁడా యసురుల నా
శము వెట్టులు తుంచునంచుఁ జింతిలి పిదపన్
శిశువుల నిరువురి నంపెను
కుశలంబుగ రండఁటంచుఁ గుశిక సుతునితోన్. 6

ఉ. అంతట రామ లక్ష్మణులు
నా ముని వెంబడిఁ దండ్రియాజ్ఞ చే
నెంతయు సంతసంబెసఁగ
నేఁగుచుఁ దాటకన్ దునిమి యా ముని యా
గాంతము నొందఁ జేయు దను
జాళి నడంచి మఖంబుఁ గాచుటన్
సంతసమందె మౌనికుల
చంద్రుఁడు స్వాంతమునందుఁ బిమ్మటన్. 7

ఆ. వె. మునివరుండు రామమూర్తియు లక్ష్మణుఁ
డరుఁగఁ ద్రోవ నను నద్భుతముగఁ
బణఁతి రూపమయ్యెఁ బాషాణ మొక్కటి
రామభద్రు పాదరజము సోఁకి. 8

క. ఆరామ చరిత మంతయు
నారాముఁ డెఱింగి మిగుల నద్భుత మందెన్
శ్రీరాముని నామాన్ని
గారవ మలరంగ వినుతిఁ గావించెఁ గడున్. 9

చ. జనకుఁడు చంద్రశేఖరుని
చాపము నెక్కిడు వారికిత్తు నా
యనుఁగు కుమారిసీతన ని
సంచు నృపాలకు లెల్ల వేగమే
చను చును నుండిరంచు ముని
చంద్రుఁడు పల్కఁగ వానితోడ నా
యనుజుని తోడఁగూడి మిథి
లాపురి కేఁగెను రాముఁడచ్చటన్. 10

మత్తకోకిల. భూతలాధిపు లెల్లఁజాలని
భూతినాథుని చాపమున్
ఆతతిన్ దునుమాడి కీర్తి
యక్ష, సిద్ధ, సుపర్వులున్
భూతలేశ్వరు లెల్ల సంయమి
పుంగవుల్ మదిలోపలన్

బ్రీతినొందఁగ రామచంద్రుఁడు
పెండ్లియాడెను జానకిన్. 11

క. పిమ్మట రాముఁడు సతితోఁ
దమ్ములతో బంధుమిత్ర తతితోడను మో
దమ్మునఁ జనునెడ నామా
ర్గమ్మునఁ బొడఁగాంచి పరశురాముం డలుకన్. 12

ఉ॥ రాముని గాంచినేఁబరశు
రాముఁడనుండ నెఱుఁగ కీవు శ్రీ
రాముఁడనంచు శంకరుని
రాజిత చాపముఁ ద్రుంచితంచు నీ
భూమిజఁగొంచుఁ బోయినను
బోవఁగనిత్తునె? రిత్తఁ బోదునే?
భూమిని సర్వభూపతులఁ
బొంకమణంచిన నన్నెఱుంగవే?॥ 13

చ॥ విఱిచితి వద్దిరా? చివుకు
విల్లు యుగంబుల నాఁటి దిప్పునా
కరమునఁ దాల్చి నీధనువు
ఖండన సేయు మటంచు నీయఁదాఁ
గరమున నంది వాని బల
గర్వము సర్వమణంప నంతటన్
శరణని పల్కి భార్గవుఁడు
సన్నుతిఁ జేసెను రామచంద్రునిన్॥ 14

ఆ॥ వె॥ సురలు పుష్పవృష్టిఁ గురియఁగ భూపతుల్
వెఱపు మాని మోదభరితులగుచు
సంచరింప రామచంద్రుఁ డప్పుడయోధ్యఁ
జేరెఁ బౌరులెల్లఁ గోరిచూడ॥ 15

సీ॥ తదనంతరమున నాదశరథ భూపతి
మంచి లగ్నంబు యోజించి యందు
శ్రీరామ పట్టాభిషేకంబుఁ జేయంగ
నుత్సాహభరితుఁడై యుండనపుడు
తనదాసి దుర్బోధ వినుచు నా కార్యము
కైక విఘ్నముచేయు కారణమున
దశరథసుతుఁడు సీతాలక్ష్మణులఁగూడి
చిత్రకూటాద్రిని జేరియుండఁ
దనయులను బాసి మరణించె దశరథుండు
వరఁగ శ్రీరాముఁ దోడ్తేర భరతుఁడరుగ
నాతనికిఁ బాదుకలొసంగి యంపిరామ
భద్రుఁడంతట దండకావనమునందు॥ 16

తే॥ గీ॥ కనివిరాధునిఁ జంపి శూర్పణఖ ముక్కుఁ
జెవులుఁగోసి మారీచుని శిరముఁ గూల్చ
నదియెఱింగి రావణుఁడు సన్యాసియగుచు
భూమిజను గొంచు లంకకుఁ బోవుచుండ॥ 17

తే॥ గీ॥ రక్కసుని చేతఁ జిక్కిన రాముదేవిఁ
గావ దశకంఠుతోఁ బోరఁగను జటాయు

వరిగి తెక్కలు గూలుట నుఱగె ధరణిఁ
గొండపోలికఁ గనువార్ధి గుండెలదర॥ 18

సీ॥ ఆరామ లక్ష్మణు లచ్చట జానకిఁ
గానక చింతిలి కాననముల
నదుర్ల వెదకుచు నరిగి జటాయువు
సీత యేగిన వార్తఁ జెప్పినీల్గ
దహనాది వివిధ కృత్యంబుల నొనరించి
పక్షికి నంతట మోక్షమొసఁగి
ఖలుఁడౌ కబంధుని కరముల దునుమాడి
ఋశ్యమూకమున సుగ్రీవుఁగూడి
వాలిఁ గూల్చి కిష్కింధకు భాను సుతునిఁ
బ్రభునిఁగా నంగదుని యువరాజుఁగాను
జేయఁగ ప్లవగులెల్ల సంతోషచిత్తులగుచు
భక్తితోఁ గొల్చుచుండ నాభానుజుండు॥ 19

ఉ॥ రాముని సత్కృపక్ దనకు
రాజ్యము భోగము గల్గెనంచు శ్రీ
రాముని దేవి వేనెదకి
రండని యాజ్ఞనొసంగ వానరుల్
స్వామి! మహాప్రసాదమని
సర్వగనెల్ల దిశల్ చరించియూ
భూమిజఁగానలేక వెతఁ
బొందుచు నుండిరికొండ లందునన్॥ 20

కం॥ కొండలు వనముల నదులఁ
గొండలు పురవర్గములను గోరి వెదకుచున్
ఎందున జానకిఁ గానక
కుందుచు నొకచోట గుంపుగూడి వసింపన్॥ 21

కం॥ హనుమంతుఁడు మొదలగునా
వనచర పుంగవుల చింతఁ బాపఁగ వారిన్
గని సంపాతి వచించెను
మనుజేశుని దేవిఁ గొన్న మార్గం బెల్లన్॥ 22

కం॥ పవమానసుతుండంతటఁ
బవమాన జవంబుతో నభముపై కెగసెన్
భువన ప్రసిద్ధ మగునా
భువననిధిని దాఁటి దనుజ పురముంగనియెన్॥ 23

కం॥ లంకాపతి యానతి నా
లంకాపురిఁ గాచుచుండు లంకిను నపుడే
పొంకమణఁచి కనె వివిధా
లంకారస్థానమైన లంకాపురమున్॥ 24

మధురగతిరగడ॥

ఆపురవరమున నలరెడు తోటల
గోపుర వితతిని గోటలఁ బేటల
సుందరతరముగ శోభిలుచుండెడు
మందిరగణమును మండపవితతిని
అపురూపములగు నారామంబుల

విపణుల రచ్చల వేశ్యాలగృహముల
కనకమణినిచయఖచిత రథంబుల
ఘనభట గజతురగ ప్రకరంబుల
రమణీయములగు రాజపథంబుల
కమలాకరములఁ గారాగృహముల
గనుఁగొనుచును జనకజ నెటఁగానక
మనమునఁ జింతిలి మారుత తనయుఁడు
కొండయునఁగఁ గనుఁగొన నొకగృహమున
దండిగనుండెడు దశకంధరు దరి
సుందరముగఁగడు శోభిలుచుండెడు
మందోదరి యను మగువనుఁ గనుఁగొని
కంటినినేఁడా క్ష్మాపుత్రికనని
మింటికెగయుచును మేదిని దుముకుచు
చెనఁటి యసురు దరిఁజెలిశయినించుట
గనియిది జానకి కాదని మరలుచు
సుదతిని వెదకి నశోక వనంబున
ముదము చెదరి రాముని మదిఁదలఁచుచు
దిక్కుఁగనక కడు దీనత గాసిలి
చెక్కిటఁ జేయిడి చింతిలఁ గనుఁగొని
ఈచానయెపుడ మీశుని సతియని
ధీచతురతతోఁ దెలిసి కొనుచు నొక
వృక్షంబున నావృక్షచరుండును

రాక్షసులకుఁ గనరాకయె నిల్చిన॥ 25

ఉ॥ ఆరఘురాము దేవిఁగన
నంతట రావణుఁడేఁగి యింతి! నా
కోరిక దీర్పుమన్న నతి
కోపముతోడను బల్కు జానకిన్
క్రూరుఁడు చంపనేఁగ నది
కూడదఁటంచును ధాన్యమాలినన్
గూరిమి మీఱఁగా సతులఁ
గూడఁగరమ్మని కొంచునేగినన్। 26

క॥ రావణుని యాజ్ఞచే నటఁ
గావలిగా నున్న దనుజకాంతలు సీతా!
రావణు నొల్లవదేలని
వేవిధములుగాను బాధ పెట్టుచునుండన్॥ 27

తే॥ గీ॥ రామునికి క్షేమకరమును రావణునికి
నాశనకరంబునగు కల నాకు వచ్చె
ననుచుఁ ద్రిజట యెఱింగింప వినుచు నసుర
కాంతలా జానకిని భక్తిఁ గనుచునుండ॥ 28

ఉ॥ మారుతి రామదూతనని
తమ్మ సుతనమ్మ వచించి ముద్రిక
శ్రీరఘురాముఁ డిచ్చెనని
చేతికొసంగిన నామెమోద నం
పూరితయై యొకానొకయ

మూల్యపు రత్నము నానవాలుగా
నారవివంశదీపకుని
కందఁగఁ జేయుమఁటంచు నిచ్చినన్। 29

క॥ చేకొని కాకాసురకథ
నాకలికి వచింప వినుచు ననిలజుఁ డంతన్
రాకాసి మూఁకతోడ న
శోకవనముఁ ద్రుంచివేయఁజూచి యలుకతోఁ॥30

సీ॥ రావణుండంప నుగ్రాకారులై వచ్చు
రాక్షసాళిని భువివ్రాలఁ జేసి
మంత్రికుమారుల మదము నణంగించి
యక్షకుమారుని హతముచేసి
యాయింద్రజితుని బ్రహ్మాస్త్రంబుచేఁ జిక్కి
దశకంఠు నీక్షింప దనుజులెల్లఁ
దనవాలమున కగ్నిఁదగిలింప నాయగ్ని
చే లంకఁగాలిచి సీతసేమ

తే॥ గీ॥ మరసి సెలవంది శీఘ్రమే యబ్ధిదాఁటి
రాఘవులతోడ నన్నివార్తలనుదెలుపఁ
బ్రీతినొంది సేతువుఁగట్టి సీతఁగాంచ
మదిని యోజింపుచుండ నమ్మఱుదినమున। 31

క॥ రాముని సతిఁగొని తెచ్చుట
చే మనకు లభించె నెల్లచేటులు నేఁడా
భామిని నొసఁగిన మేలనఁ

దామసమున రావణుండు దన్నననుజునిన్ 32
తే॥ గీ॥ అవిభీషణుఁడట పరిభావమంది
శరణఁటంచును శ్రీరామచంద్రుఁ జేరఁ
గరుణతోడను నాతనిఁగాంచుచు నభ
యమ్మొసంగెను బగవాని తమ్ముఁడనక॥ 33
క॥ వనచర పుంగవు లంతట
వననిధి బంధింపఁగాంచి వాలితనూజున్
ఇనకులమణి యగు రాముఁడు
పనిచె దనుజపతికి రాయబారిగనంతన్॥ 34
క॥ వనచరుఁడు రావణునితో
జనపతి వచియింపుమనిన సరణిఁబలికి తా
వినమొల్లమి నెఱిఁగించినఁ
గనలుచు రాముండుఁగదలెఁ గపిసైన్యములో॥ 35
తే॥ గీ॥ పంక్తిముఖుఁడును సేనలఁ బదిలపఱుప
నంతవారును వీరు జయాభిరతిని
భూరిసేనలతోఁగూడి ఘోరముగను
బోరొనర్చిరి నెత్తురు ధారలొలుక॥ 36
క॥ హనుమ, గ్గవయ, గవాక్షులు,
వినజ, సుషే, ణాంగదాదు లెల్ల కపివరుల్
అనిమొన దనుజులఁ గూల్చుటఁ
గని దశకంధరుని సుతుఁడు గడురోషమునన్॥ 37
క॥ ఉరగాస్త్రమేయుఁగాఁ నది

పరుగులిడుచు రాఘవులను బంధించుటచే
ధరిణింబడి మూర్ఛిల్లిన
గరుడుండరుదెంచి మూర్ఛఁ గ్రిక్కునఁదేర్చెన్॥ 38

తే॥ గీ॥ పంక్తికంఠుని సేనాధిపతులఁబట్టి
హాత మొనర్చిరి హనుమయు నంగదుండు
కుంభకర్ణుని రాముండు గూలనేసె
నిండ్రజిత్తుని లక్ష్మణుం డీల్గఁజేసె॥ 39

క॥ దనుజేంద్రుఁడు కోపంబున
ఘనతరమగు శక్తిసాయకము నేయఁగ ల
క్ష్మణమూర్తి మూర్ఛఁజెందిన
హనుమయు సంజీవిఁదెచ్చి యాతని మనిచెన్॥ 40

తే॥ గీ॥ రావణుండంతఁ గ్రుద్ధుఁడై రాఁగఁ జూచి
మూల బలములతో వానిఁగూలఁజేసె
రామచంద్రుఁడు లోకులారాయనంగఁ
గుసుమవృష్టిని సురలెల్లఁ గురిసి రపుడు॥ 41

క॥ మగణించిన దశకంఠుని
పరలోకక్రియలఁ జేయఁ బనివిన నల్లే
జరిపె విభీషణుఁడన్నియు
గౌరవముగ రామునాజ్ఞఁ గాదనకుండన్॥ 42

ఉత్సాహావృత్తము॥
జనకజాత విమలచరిత
సాధ్వియంచుఁ దెలిసియున్

జనములెల్ల రెఱుఁగ రామ
చంద్రుఁడంత సచ్చటన్
అనలమందుఁ జొరఁగఁజేసి
యంబుజాక్షిఁ జేకొనన్
గనెడి సురలు మునులు మోద
కలితులైరి యంతటన్॥ 43

ఉత్సాహవృత్తము॥
పలికి బొంకనట్టి రామ
భద్రుఁడా విభీషణున్
అలఘుకరుణ దనుజపురికి
నధిపుఁ జేసి వానరుల్
గొలువ సతిని నను జుఁ గూడి
కూర్మి నాత్మ రత్నసం
కలితమా కుబేర పుష్ప
కంబు నెక్కి వేచనెన్॥ 44

తే॥ గీ॥ రాముఁడట్టు లయోధ్యా పురంబుఁ జేరి
రాజ, బుధవర, ముని, గురురాజులమర
సీతతోఁగూడి పట్టాభిషిక్తుఁడగుచు
శిష్టసమ్మతిఁ బెక్కేండ్లు క్షితిని నేలె॥ 45

క॥ ఈరామాయణ సుచరిత
పారాయణ పరులు దీనివ్రాసినవారల్
శ్రీరాముని సత్కృపచే

నారోగ్యము ధనము యశము నందేద ర్తైపుడున్ ।
తే. గీ। ఔంకపూడ్యన్వవాయ కోదండరాయ
సచివుఁడతులిత సద్భక్తి సాందుుఁడగుచుఁ
గోరవ్రాసిన దీనిఁ జేకొను నృపేంద్ర!
రమ్యగుణసాంద్ర! పట్టాభిరామచంద్ర! 47
క॥ రాముని చరితము లీలా
రామాయణముగను బాడుగ రామబ్రహ్మం
బీమహిరచించె నాయుడు
పోమార్కుంబగుచు నిద్ది శోభిలుఁగాతన్ । 48

శ్రీరామచంద్రపరబ్రహ్మార్పణమస్తు.



# శ్రీ రా మ దం డ క ము.

శ్రీమద్రమామానినీ మానసాబ్జాత సూరా! రతీనా
యకాకార! యింద్రాబ్జగర్భాది బృందారకవ్రాత సం
పూజ్య పాదారవిందద్వయా! దీనమందార! గోవింద!
యోగీంద్రలోలా! చిదానందరూపా! మహాఘోర పాపా
టవీవీతిహోత్రా! పురారాతిమిత్రా! సుచారిత్ర, మి
త్రాబ్జనేత్రా! మహాక్రూరుఁడౌ యద్దశగ్రీవుచే బాధల
న్బొందుచున్ దాళఁగా లేక బృందారకుల్, మౌనిబృం
దంబులున్నిన్నుఁ బ్రార్థింపమేలంచు నాలించియవ్వార
లన్ బ్రోవనూహించి శ్రీసూర్యవంశార్ణవంబందు సం
పూర్ణ తేజంబుతో రామచంద్రుండవై పుట్టి గాధేయ
యాగంబుఁగావఁగా నేఁగుచున్ దాటకంగొట్టి యా
గంబురక్షించి యామార్గమధ్యంబునందున్న గుండ్రాతిని
న్నాతిగాఁ జేసిభూతేశు చాపంబు ఖండించి భూపుత్రిఁ బెం
డ్లాడి యేతెంచుచోగాంచినిందించు నాభార్గవున్ బాహు
గర్వంబు సర్వంబుఁబోఁగొట్టి సాకేతకుంజేరి కైకేయి
వాక్యంబుఁజెల్లింపఁగా సీతతో భ్రాతతోఁ గాననవ్రాత
ముంజేరి హింసింపనేతెంచు దుష్టాసురవ్రాతమున్ జీల్చి
చెండాడినీచాత్మురాలైన యాచుప్పనాతిన్విలోకించికోపం
బునన్ నాసికాకర్ణముల్గోసి మారీచునిందుంపఁగా నేఁగు

టన్ సీతఁగోల్పోయి యమ్మానినిన్ గాంచఁగా నేఁగుచున్
ఋష్యమూకాద్రినిం జేరి సుగ్రీవుతో సఖ్యముం జేసి యవ్వా
లినింగూల్చి యోయాంజనేయా! వడిన్ జానకిన్ గాంచిర
మ్మన్నవారందు వేపోయిలంకాపురింజొచ్చి శోధించి పం
కేరుహాస్యన్ బాడంగాంచి భాషించి నీయొక్క క్షేమంబు
నారామతోఁ జెప్పి యమ్మానిసీరత్నమందిచ్చి చూడామ
ణింగొంచు లంకాపురిన్ గాల్చి వేవేగనీసన్నిధానంబునం
జేరి యచ్చోటివృత్తాంతమాద్యంతమున్ దెల్పనాలించి
యవ్వానరానీకముంగూడి పాథోధిబంధించి లంకాపురిం
జొచ్చి లంకేశ్వరున్ వానిసైన్యంబుతోఁ గూల్చి యాలం
కకున్ గుంభకర్ణానుజున్ రాజుగాఁ జేసి లోకైకవిఖ్యా
తయౌ సీతతోఁ బ్రీతిసాకేతకేతెంచి పట్టాభిషిక్తుండవై
శిష్టభక్తాళిఁ గాపాడుచున్ దుష్టులన్ ద్రుంచుచున్ బెద్ద
కాలంబు రాజ్యంబుఁ బాలించి సత్కీర్తిఁ బ్రఖ్యాతినింగాం
చు నీచిత్రచారిత్ర మాహాత్మ్యమున్నేర్పు చందంబునన్
ధాత్రి వైశాఖపట్నంబునన్నిదు దాసానుదాసుండు
పొడ్గన్వయంబందుఁ జెన్నొందు శ్రీరాములిస్మాహ్వయుం
డొంటు పూదండగాఁ గూర్చి యర్పించు నీదండకంబుం గృ
పాదృష్టిఁ జేకొంచు భక్తాళిలో నెవ్వరేనిం బఠింపంగ నవ్వా
రికాయుష్య మైశ్వర్య మారోగ్యమున్ గూర్చి భూమండ
లిన్ గీర్తి చే వెల్గఁగాఁ జేసి రక్షింపుమో రామచంద్రా! కృ
పాసాంద్ర! తుభ్యంనమస్తే, నమస్తే, నమస్తే, నమః॥

